ఆదివారం జనవరి 30

శక 1887 మాఘ 10

## మద్రాస్-ఏ

416.7 మీ (720 కిలోసైె)
ఉ॥ 6-00 నుండి 9.15 వరకు
మ॥ 12.00 నుండి రా॥ 12.00 వరకు
60.98 మీ (4920 కిలోసై)
ఉ॥ 6-30 నుండి 9.15 వరకు
41.90 మీ (7160 కిలోసై)
మ॥ 12.00 నుండి 4.30 వరకు
60.98 మీ (4920 కిలోసై)
సా॥ 6.40 నుండి రాత్రి 11.00 వరకు

ఉ॥ ప్రసారం I

6-00* వందేమాతరం, మంగళగానం
6.05 ఎండ్రై మహాత్మా సంగీత రూపకం
సమర్పణ: కె. సి. త్యాగరాజన్
6.35 నేటి కార్యక్రమ వివరాలు, వాతావరణసూచన
6.40 ఆంగ్లంలో వార్తలు
6.45 తుదిప్పాడల్‌గళ్
6.55 అరుళ్ వాక్కు
7.00 సంగీత మంజరి
7.15 తమిళంలో వార్తలు (193.5 మీటర్లపైగూడా)
7.30 చిత్రగానం
8.00 ఆంగ్లంలో వార్తలు
8.15 ఎస్. నరసింహులు
9.15 అమరవాక్కు సర్వోదయంపై రూపకం (తమిళం)
9.30 సంగీతోపన్యాసం పి. వరదాచారియార్
10.30 మధురగీతం
10.55 ఆంగ్లములో వార్తలు
11.00 ప్రాంతీయ శెయిదిగళ్ (193.5 మీటర్లపైగూడా)
11.05 ప్రసార సమాప్తి

మ॥ ప్రసారము II

12.00* వాద్యగోష్ఠి
12.30 సూర్యకాంతి (తిరుచ్చినుండి రిలే)
1.00 ఎల్. ఎమ్. స్వామినాథన్: భక్తిపాటలు
1.30 ఆంగ్లంలో వార్తలు
1.40 చిత్రగానం
శ్రీవల్లి, శివకామి
సారంగధర
పణంపడైత్తవన్
యారుక్కు సొందం
వడియుక్కు తళై కావ్వా
వల్లవనుక్కు వల్లవన్
2.00 తమిళంలో వార్తలు (193.5 మీటర్లపైగూడా)
2.10 పాపామలర్ పిల్లలకు
3.00 చిత్రగానం
3.30 నాటిక (తమిళం)
4.30 భక్తి పాటలు (తిరుచ్చినుండి రిలే)
5.30 కొత్తూర్ అలిమేలు మంగమ్మ: వీణ
6.00 ఆంగ్లములో వార్తలు
6.05 ప్రాంతీయ శెయిదిగళ్
6.15 శెయిది కురిప్పుగళ్
6.20 మధుర గీతం
6.40 విరామ సంగీతం
6.45 ఊరి క్కాల్ రూపకం
7.00 సర్వోదయదినము ప్రసంగం (తమిళం) (తిరుచ్చినుండి రిలే)
7.15 తమిళంలో వార్తలు (193.5 మీటర్లపైగూడా)
7.30 వ్యవసాయదారులకు
8.00 కొత్తూర్ అలిమేలు మంగమ్మ: వీణ
8.15 Radio News Reel
8.30 పొలగం జె. మంగళం
9.00 ఆంగ్లంలో వార్తలు
9.15 శెయిది అరంగం
9.30 సంగీత నాటిక (తిరుచ్చినుండి రిలే)
10.30 చిత్రగానం
11.00 శాస్త్రీయ సంగీతం
11.30 హిందూస్థానీ సంగీతం†
11.55 ఆంగ్లంలో వార్తలు
12.00 జనగణమన, ప్రసారసమాప్తి

## మద్రాస్-బి

ఉ॥ ప్రసారము I

211.3 మీ (1420 కిలోసై)
6.00 మద్రాస్ ఎ వలె
7.00 తెలుగులో వార్తలు (193.5 మీటర్లపైగూడా)
7.15 సత్యం ఒన్రే అయుదం [గాంధీ సత్యంపై పాటలు (తమిళం)]
7.30 మద్రాస్ వలె
8.00 ఆంగ్లంలో వార్తలు
8.15 హిందూస్థానీ సంగీతం
8.45 ఆటవిడుపు
సమర్పణ: పద్మావతి
బాలల సంఘం
పిలుపు పాట
నీకు సహాయం నీవే నాటిక
రచన: వి. ఎన్. చారి
పాట నేర్చుకో
గాంధీ మహాత్ముడు: సర్వోదయము
ఉత్తరాలకి జవాబులు
చిక్కు ప్రశ్న
మీ పాటలు, కథలు
పోదామా
[9-30 నుండి 10.30 వరకు 41.90 మీటర్లపై గూడా]
9-30 కళాతరంగం
10.00 హరామళి
10.30 ప్రసార సమాప్తి

మ॥ ప్రసారము II

211.3 మీ (1420 కిలోసై)
12.00 మద్రాస్ ఎ వలె
12.30 కీర్తనమాలిక
1.00 పాశ్చాత్య సంగీతం
1.30 ఆంగ్లములో వార్తలు
1.40 హిందీలో వార్తలు
1.50 తెలుగులో వార్తలు
2.00 రెండు నాటికలు
కనికరించకు కష్టపడతావు
రచన: ఎమ్. సూరి
పుష్పాంజలి
రచన: పి. గణపతి శాస్త్రి
3.00 వాతావరణసూచన, ప్రసార సమాప్తి

సా॥ ప్రసారము III

211.3 మీ (1420 కిలోసై)
(5.30 నుండి 6.40 వరకు 60.98 మీటర్లపై గూడా)
5.30* పాశ్చాత్య సంగీతం†
6.00 ఆంగ్లంలో వార్తలు
6.05 మద్రాస్ ఎ వలె (193.5 మీటర్లపైగూడా)
6.20 వాతావరణసూచన, స్థానిక ప్రకటనలు వాణిజ్యవార్తలు కార్యక్రమ వివరాలు
6.40 పొలగం జె. మంగళం
7.00 తెలుగులో వార్తలు (193.5 మీటర్లపైగూడా)
7.15 వాద్య సంగీతం
7.30 గీతమాలిక
8.00 మద్రాస్ ఎ వలె
8.30 ఇతర ప్రాంత సంగీతం†
8.45 విరామ సంగీతం
8.55 Topic for today
9.00 ఆంగ్లంలో వార్తలు
9.15 Focus on Matters of current interest
9-30 పాశ్చాత్య సంగీతం
10.30 ఆంగ్లంలో వార్తలు
10.35 వాతావరణసూచన, జనగణమన, ప్రసార సమాప్తి

## మద్రాస్-సి

193.5 మీ (1550 కిలోసై)
వివిధ భారతి (రిలే)
(వివరాలు 48-వ పేజీలో)

## బెంగుళూర్

ఉ॥ ప్రసారం I

491.8 మీ (610 కిలోసై)
6.30* వందేమాతరం, మంగళధ్వని సుప్రభాత, విచార దీప్తి వాతావరణసూచన
6.40 ఆంగ్లంలో వార్తలు
6.45 కార్యక్రమ వివరాలు
6.50 శివారాధన
7.15 ప్రాచీన కవివాణి
7.45 కన్నడంలో వార్తలు
8.00 ఆంగ్లంలో వార్తలు
8.15 రాబోయే కార్యక్రమముల వివరాలు
8.30 ద్వారం వెంకటస్వామి నాయుడు: వయొలిన్
9.30* ప్రసార సమాప్తి

మ॥ ప్రసారము II

12.00* పాశ్చాత్య సంగీతం†
12.30 డి. నాగప్ప
1.00 చిత్రగీత†
1.10 కన్నడంలో వార్తలు
1.20 కన్నడ గీతావళి
1.30 ఆంగ్లంలో వార్తలు
1.40 హిందీలో వార్తలు
1.50 గానవైవిధ్య†
2.00 వాతావరణసూచన, పిల్లలకు (కన్నడం)
2.30* ప్రసార సమాప్తి

సా॥ ప్రసారము III

4.00* నందదీప సంక్షిప్త శబ్దచిత్రం (కన్నడం)
5.30 కార్మికుల కార్యక్రమము
6.00 ఆంగ్లంలో వార్తలు
6.05 ప్రాంతీయ వార్తలు వాతావరణసూచన (ఆంగ్లం)
6.10 గీతగంగ†
6.35 ప్రదేశ సమాచార
6.45 వార్తావివరణె
6.50 నాట్య సంగీత†
7.00 గ్రామస్థులకు
7.45 కన్నడంలో వార్తలు
8.00 సర్వోదయ సిద్ధాంత ప్రసంగం (కన్నడం) యమునాచార్య
8.10 వాద్యశ్రీ†
8.15 శ్రోతల ఉత్తరాలకు జవాబులు
8.30 శ్రోతలు కోరినపాటలు†
8.55 Topic for today
9.00 ఆంగ్లంలో వార్తలు
9.15 Focus
9.30 గీతగుచ్ఛ
9.45 టి. పుట్టస్వామయ్య: రాగం, తానం, పల్లవి
10.30 ఆంగ్లములో వార్తలు
10.35 వాతావరణసూచన, జనగణమన ప్రసారసమాప్తి

## సోమవారం జనవరి 31

శక 1887 మాఘ 11

### హైదరాబాదు-ఎ

ఉ॥ ప్రసారము I

405.4 మీ (740 కిలోసై)

6.30* వందేమాతరం, కార్యక్రమ వివరణ
6.40 ఇంగ్లీషులో వార్తలు
6.45 భక్తిరంజని
6.55 సూక్తిముక్తావళి
7.00 తెలుగులో వార్తలు
7.15 లలిత సంగీతం : కమలా చంద్రబాబు
7.30 వాద్య సంగీతం ¶ కారుకురుచి అరుణాచలం: నాదస్వరం
8.00 ఇంగ్లీషులో వార్తలు
8.15 సంకీర్తనం
8.30 జి. ఎ. జోడ్కర్, వేణువు
9.00* వాతావరణ సూచన, ప్రసార సమాప్తి

మ॥ ప్రసారము II

11.45 For the High Schools English lesson for Seniors presented by the Central Institute of English, Hyderabad
12.05 ప్రసార సమాప్తి

ప్రసారము III

12.30* కార్మికుల కార్యక్రమము (విజయవాడనుండి రిలే)
1.00 ఎస్. డి. పార్వతీకర్, వేణువు
1.30 ఇంగ్లీషులో వార్తలు
1.40 హిందీలో వార్తలు
1.50 తెలుగులో వార్తలు
2.00 హైదరాబాదు బి వలె
2.01 మరాఠీ శ్రోతలకు
2.10 ఉర్దూలో వార్తలు
2.20 నారాయణ్‌రావు వ్యాస్ ¶
2.30* ప్రసార సమాప్తి

సా॥ ప్రసారము III

5.30* స్థానిక ప్రకటనలు
5.35 లలిత సంగీతం: బృందగానం
5.50 పద్యపఠనం
6.00 ఇంగ్లీషులో వార్తలు
6.05 ప్రాంతీయ వార్తలు (ఉర్దూ) (హైదరాబాదు, కడపలు మాత్రమే)
6.15 ప్రాంతీయ వార్తలు
6.25 ప్రస్తుతాంశం
6.30 వ్యావసాయిక విషయాలు (విజయవాడనుండి రిలే) ధరలు
7.00 తెలుగులో వార్తలు
7.15 దీక్ష
7.25 ముఖ్యప్రకటనలు, విరామ సంగీతం
7.30 విజయవిపంచి రూపకం
7.45 హైదరాబాదు బి వలె
8.00 విశ్వవిద్యాలయాలకు (విజయవాడనుండి రిలే)
8.30 Sports round-up
8.45 ధను: నిలయ విద్వాంసులు
8.55 Topic for today
9.00 ఇంగ్లీషులో వార్తలు
9.15 ఉర్దూలో వార్తలు
9.30 జానపద గేయాలు
9.45 స్వరతరంగిణి సంగీత సంచికా కార్యక్రమము (విజయవాడనుండి రిలే)
10.30 ఇంగ్లీషులో వార్తలు
10.35 వాతావరణసూచన, నేటి భావన, జనగణమన, ప్రసార సమాప్తి

### హైదరాబాదు-బి

### కడప

265.5 మీ (1130 కిలోసై)

### విశాఖపట్నం

322.6 మీ (930 కిలోసై)

సా॥ 5.30 నుండి రా॥ 9.30 వరకు

ఉ॥ ప్రసారము I

89.42 మీ (3355 కిలోసై) (హైదరాబాదు మాత్రమే)

6.30* హైదరాబాదు ఎ వలె
7.45 ప్రసార సమాప్తి

ప్రసారము I (తరువాయి)

06.12 మీ (4990 కిలోసై)

8.00 హైదరాబాదు ఎ వలె
9.00* వాతావరణసూచన, ప్రసార సమాప్తి

మ॥ ప్రసారము II

42.02 మీ (7140 కిలోసై) (హైదరాబాదు మాత్రమే)

11.45 హైదరాబాదు ఎ వలె
12.05 ప్రసార సమాప్తి

ప్రసారము III

12.30* హైదరాబాదు ఎ వలె
1.00 టి. వి. సుబ్రహ్మణ్య శాస్త్రి
1.30 హైదరాబాదు ఎ వలె
2.00 వాతావరణసూచన
2.01 టి. వి. సుబ్రహ్మణ్య శాస్త్రి
2.30* ప్రసార సమాప్తి

సా॥ ప్రసారము IV

60.12 మీ (4990 కిలోసై)

5.30* హైదరాబాదు ఎ వలె
7.00 తెలుగులో వార్తలు

### విజయవాడ

357.1 మీ (840 కిలోసై)

ఉ॥ ప్రసారము I

6.30* వందేమాతరం, శుభోదయం ప్రసార విశేషాలు
6.40 ఇంగ్లీషులో వార్తలు
6.45 భక్తిరంజని (హైదరాబాదునుండి రిలే)
6.55 సూక్తిముక్తావళి
7.00 తెలుగులో వార్తలు
7.15 లలిత సంగీతం (హైదరాబాదునుండి రిలే)
7.30 సంగీత శిక్షణ
7.45 అయ్యగారి సోమేశ్వరరావు: వీణ
8.00 ఇంగ్లీషులో వార్తలు
8.15 హిందీలో వార్తలు
8.30 హైదరాబాదు వలె
9.00 ప్రసార సమాప్తి

మ॥ ప్రసారము II

11.45* ఉన్నత పాఠశాలలకు (హైదరాబాదునుండి రిలే)
12.05 వాద్య సంగీతం ¶
12.15 వార్తలు-వ్యాఖ్యలు దేశభక్తి గేయం
12.30 కార్మికుల కార్యక్రమము ఫిల్మ్ సంగీతము ¶ ఆహార కొరత తీరుస్తే జయం మనదే ప్రసంగం ధర్మసందేహాలు విశేషాలు, కబుర్లు
1.00 అయ్యగారి సోమేశ్వరరావు: వీణ
1.30 ఇంగ్లీషులో వార్తలు
1.40 హిందీలో వార్తలు
1.50 తెలుగులో వార్తలు
2.00 వాతావరణ సూచన, ప్రసార సమాప్తి

సా॥ ప్రసారము III

5.30* స్థానిక ప్రకటనలు
5.35 హైదరాబాదు వలె
5.50 హైదరాబాదు వలె
6.00 ఇంగ్లీషులో వార్తలు
6.05 వాద్య బృందం
6.15 ప్రాంతీయ వార్తలు
6.25 ప్రస్తుతాంశం (హైదరాబాదునుండి రిలే)
6.30 వ్యావసాయిక విషయాలు పౌర బాధ్యతలు-ప్రజల కర్తవ్యం-గ్రామసేవకుని కృషి డాక్యుమెంటరీ రూపకం సిద్ధహస్తుడు నాగపూర్‌లోని మహాజన్ సంభాషణ ప్రకటనలు, ధరల సమీక్ష వాతావరణవివరాలు
7.00 తెలుగులో వార్తలు
7.15 దీక్ష (హైదరాబాదునుండి రిలే)
7.25 ముఖ్యప్రకటనలు
7.30 హైదరాబాదు వలె
7.45 లలిత సంగీతం ¶
8.00 For the Universities Earth Sciences: Monsoons and the Indian weather talk by Dr. V. P. Subrahmanyam The Influence of Epics (Ramayana and Mahabharata) on Indian life and literature talk by Dr. K. Viswanatham
8.30 Weekly Sports round-up (relay from Delhi)
8.40 చిత్రతరంగిణి- ఫిల్మ్ సంగీతం ¶
8.55 Topic for today
9.00 ఇంగ్లీషులో వార్తలు
9.15 Focus: on matters of current interest
9.25 విరామ సంగీతం
9.30 ఆంధ్రప్రదేశ్ జానపదగేయాలు (హైదరాబాదునుండి రిలే)
9.45 స్వరతరంగిణి సంగీత సంచికా కార్యక్రమము
10.30 ఇంగ్లీషులో వార్తలు
10.35 వాతావరణ సూచన, జనగణమన, ప్రసార సమాప్తి

7.15 హైదరాబాదు ఎ వలె
7.45 వాద్యగోష్ఠి
8.00 హైదరాబాదు ఎ వలె
8.30 చిత్రసీమ ¶
8.55 హైదరాబాదు ఎ వలె
9.15 Focus : On Matters of Current Interest
9.30 హైదరాబాదు ఎ వలె
10.35 వాతావరణ సూచన, నేటి భావన, జనగణమన, ప్రసార సమాప్తి

### హైదరాబాదు-సి

245.9 మీ (1220 కిలోసై)

వివిధభారతి (రిలే)

[వివరాలు 48-వ పేజీలో]

### విజయవాడ-బి

300 మీ (1500 కిలోసై)

వివిధభారతి (రిలే)

[వివరాలు 48-వ పేజీలో]



* వాతావరణసూచన ¶ గ్రామఫోన్ రికార్డు § స్థానికంగా రికార్డింగ్

సోమవారం జనవరి 31

శక 1887 మాఘ 11

## మద్రాస్-ఎ

416.7 మీ (720 కిలో సై)

ఉ॥ 6.00 నుండి 9.15 వరకు

మ॥ 12.00 నుండి 2.10 వరకు

సా॥ 5.30 నుండి రా॥ 12.00 వరకు

60.98 మీ (4920 కిలో సై)

ఉ॥ 6.30 నుండి 9.15 వరకు

41.90 మీ (7160 కిలో సై)

మ॥ 12.00 నుండి 2.10 వరకు

60.98 మీ (4920 కిలో సై)

సా॥ 6.40 నుండి రా॥ 11.00

### ఉ॥ ప్రసారము I

6.00* వందేమాతరం, మంగళగానం
6.05 సుశీలా శ్రీనారాయణన్
6.35 నేటి కార్యక్రమ వివరణ, వాతావరణ సూచన
6.40 ఆంగ్లంలో వార్తలు
6.45 తుదిప్పాడల్‌గళ్
6.55 అరుళ్ పాడు
7.00 వాద్య సంగీతం : వీణ, వయొలిన్
7.15 తమిళములో వార్తలు (193.5 మీటర్లపైగూడా)
7.30 సంగీతామృతం
8.00 ఆంగ్లంలో వార్తలు
8.15 టి. వి. రత్నం
చిత్తూర్ గోపాలకృష్ణన్ : వయొలిన్
మదురై టి. శ్రీనివాసన్ : మృదంగం
కె. నారాయణస్వామి : ఘటం
9.30 చిత్రగానం
అతిశయ తిరుడన్
అవనా ఇవన్
ఇదయ కమలం
ఎంగవీట్టు పెణ్
కుయందయుం దైవముం
ఆండవన్ కట్టళై
ధర్మం తలై కాక్కుం
ఎంగళ్ కుటుంబం, పరిసు
10.00 సుశీలా శ్రీనారాయణన్
10.30 మధురగీతం
10.55 ఆంగ్లంలో వార్తలు
11.00 ప్రాంతీయ శెయిదిగళ్ (193.5 మీటర్లపైగూడా)
11.05 ప్రసార సమాప్తి

### మ॥ ప్రసారము II

12.00* కార్మికుల కార్యక్రమము
12.30 పాఠశాలలకు (తమిళం)
1.00 మాదర్ నిగళ్చి స్త్రీలకు
1.30 ఆంగ్లంలో వార్తలు
1.40 వాద్యగోష్ఠి
2.00 తమిళములో వార్తలు (193.5 మీటర్లపైగూడా)
2.10 ప్రసార సమాప్తి

### సా॥ ప్రసారము III

5.30* మన్నార్‌గుడి ఆర్. సాంబశివన్
6.00 ఆంగ్లములో వార్తలు
6.05 ప్రాంతీయ శెయిదిగళ్
6.15 శెయిదికుతిప్పుగళ్
6.20 సంగీతమంజరి
6.40 పొదునోక్కు
6.45 రూపకం (తమిళం)
7.00 చిత్రగానం
పాండవ వనవాసం
ప్రేమించిచూడు
సుమంగళి
ఉయ్యాలా జంపాలా
7.15 తమిళములో వార్తలు (193.5 మీటర్లపైగూడా)
7.30 వ్యవసాయదారులకు (తిరుచ్చినుండి రిలే)
8.00 మెల్లిసై: కె. వీరమణి
8.15 పాల్ఘాట్ సుబ్రహ్మణ్య అయ్యర్
8.30 శారదా సుకుమారన్
9.00 ఆంగ్లములో వార్తలు
9.15 పుస్తకసమీక్ష (తమిళం)
9.30 రూపకం (తమిళం)
9.45 రాగం, తానం, పల్లవి :
ఎమ్. ఎ. కల్యాణకృష్ణ భాగవతర్ : వీణ
సి. ఎస్. రామస్వామి : మృదంగం
10.30 చిత్రగానం
11.00 పాశ్చాత్య సంగీతం†
11.55 ఆంగ్లములో వార్తలు
12.00 జనగణమన, ప్రసారసమాప్తి

## మద్రాస్-బి

### ఉ॥ ప్రసారము I

211.3 మీ (1420 కిలో సై)

6.00 మద్రాస్ ఎ రిలే
7.00 తెలుగులో వార్తలు (193.5 మీటర్లపైగూడా)
7.15 భక్తిగానం
7.30 మద్రాస్ ఎ రిలే
8.00 ఆంగ్లములో వార్తలు
8.15 ప్రసార సమాప్తి

### మ॥ ప్రసారము II

211.3 మీ (1420 కిలో సై)

12.00 మద్రాస్ ఎ రిలే
1.00 పాశ్చాత్య సంగీతం†
1.30 ఆంగ్లంలో వార్తలు
1.40 హిందీలో వార్తలు
1.50 తెలుగులో వార్తలు
2.10 వాతావరణ సూచన, ప్రసార సమాప్తి

### సా॥ ప్రసారము III

211.3 మీ (1420 కిలో సై)

[5.30 నుండి 6.40 వరకు 60.98 మీటర్లపైగూడా]

5.30* పాశ్చాత్య సంగీతం
6.00 ఆంగ్లములో వార్తలు
6.05 మద్రాస్ ఎ రిలే (193.5 మీటర్లపైగూడా)
6.20 వాతావరణసూచన, స్థానిక ప్రకటనలు, వాణిజ్యవార్తలు కార్యక్రమవివరణ
6.40 మన్నార్‌గుడి ఆర్. సాంబశివన్
7.00 తెలుగులో వార్తలు (193.5 మీటర్లపైగూడా)
7.15 చిత్రగానం†
స్వర్ణమంజరి
కుంకుమరేఖ
కులగోత్రాలు, కర్ణ
7.30 గీతమాలిక
8.00 Spotlight
A causerie on men and matters
8.15 వాద్య సంగీతం, క్లారినెట్
8.30 Sports round up (relay from Delhi)
8.45 విరామ సంగీతం
8.55 Topic for today
9.00 ఆంగ్లములో వార్తలు
9.15 Focus : On Matters of Current Interest
9.30 ఆంధ్రదేశపు జానపద గీతాలు
9.45 రేడియో నాటక గీతాలు
10.00 భక్తిరంజని
10.30 ఆంగ్లములో వార్తలు
10.35 వాతావరణ సూచన, జనగణమన, ప్రసార సమాప్తి

## మద్రాస్-సి

193.5 మీ (1550 కిలో సై)

వివిధభారతి (రిలే)

(వివరాలు 48 వ పేజీలో)

## బెంగుళూర్

### ఉ॥ ప్రసారము I

491.8 మీ (610 కిలో సై)

6.30* వందేమాతరం, మంగళధ్వని. సుప్రభాత, విచారదీప్తి వాతావరణసూచన
6.40 ఆంగ్లములో వార్తలు
6.45 కార్యక్రమ వివరణ
6.50 గీతారాధన
7.15 హెచ్. ఎస్. మహాలక్ష్మి
7.45 కన్నడములో వార్తలు
8.00 ఆంగ్లములో వార్తలు
8.15 వాద్య బృంద
8.30 హెచ్. ఎస్. అనసూయ
8.40 బజారుధరలు
8.50 ప్రసార సమాప్తి

### మ॥ ప్రసారము II

12.00* కార్మికుల కార్యక్రమము
12.30 రాజలక్ష్మి తిరునారాయణన్: వీణ
1.00 గానామృత†
1.10 కన్నడములో వార్తలు
1.20 హేమంతకుమార్, హెచ్. దీగిత†
1.30 ఆంగ్లములో వార్తలు
1.40 హిందీలో వార్తలు
1.50 శాంతా సక్సేనా: హిందీభజన్†
2.00* వాతావరణసూచన, ప్రసార సమాప్తి

### ప్రసారము III

3.00* ఉన్నత పాఠశాలలకు
3.20* ప్రసార సమాప్తి

### సా॥ ప్రసారము IV

6.00 ఆంగ్లములో వార్తలు
6.05 ప్రాంతీయ వార్తలు వాతావరణసూచన (ఆంగ్లం)
6.10 కన్నడదేశపు జానపద గేయాలు
6.35 ప్రదేశసమాచార
6.45 వార్తావివరణె
6.50 ఉర్దూ పాటలు†
7.00 గ్రామస్థులకు
7.45 కన్నడములో వార్తలు
8.00 పాశ్చాత్య సంగీతం
8.30 ఢిల్లీనుండి రిలే
8.45 గానసుధ†
8.55 Topic for today
9.00 ఆంగ్లములో వార్తలు
9.15 Indian Handicrafts through the ages talk by G. V. Viswanath
9.30 ఆనంద తీర్థ సంగీత రూపకం
10.30 ఆంగ్లములో వార్తలు
10.35 వాతావరణసూచన, జనగణమన, ప్రసార సమాప్తి

# సంగీత  శిక్షణ

## [ జూనియర్లకు ]

సోమ, మంగళ వారములు.　　　　　　　　　　28 వ మేళ కర్తజన్యం

వర్ణము :—　　కాంభోజి రాగం—మిశ్రజాతి ఝంపె తాళం　　మూర్ఛన :— స రి గ మ ప ద స　స ని ద ప మ గ రి స

పల్లవి :—

| | | |
|---|---|---|
| మా గా సా . ని ధా ధా సా ; ధ ధ స ధ ధ స రి స స రి గ రి | రి గ మ గ | రీ గ మ గా . రి గ స రి గ |
| క మ లా . . . . క్షీ . వి . . . న్నె . . . కో . . . | రి . . . | యు . . . . న్న . ది . ర |
| ధా స రి గా రి గ మా మా గ మ పా మ ప దా ని ద పా మ ప ద స ద ప | మ ద ప మ | ప మ గ గ రి స రి గ ॥ . |
| క ట . . ణిం . ప నా . సా మి . . . . . . స . . . . . | మ . . . | యు . . ము . . . ర ॥క॥ |

అనుపల్లవి :—

| | | |
|---|---|---|
| దా పా ; మా ; పా గా ; మా పా ; దా దా ; | పీ దా | పా దా ; సా ॥ |
| ఉ మా . ప . తి వె . ల యు . కో టీ . | శ్వ ర | పు . . ర |
| ; రీ మ గ గ రి సా గ రి రి స నీ రి స స ని దా స ని ని ద పా | మ ప ద స | ద ప మ గ రి స రీ ॥ |
| . ము న్న . . . ము ద్దు . . . రా మ . . . లిం గ . . . భూ | ప . తి . | చ ం ద్ర . వి న ర ॥ |

ముక్తాయిస్వరం :—

| | | |
|---|---|---|
| గా గ మ గ రి రీ రి గ రి స రీ రి స ని ధ ధ ధ సా ; ధ ధ స ధ | రి స గ రి | మ గ ప మ గ రి స రి ॥ |
| గా గ మ గ రి గ మ పా ద ప ప మ ప ని ద మ ప ద సా ని ద పా ద రీ | సా ని ద | ని ప మ గ . స రి గ ॥క॥ |

చరణం :—

| | | |
|---|---|---|
| నీ ; దా పా ; మ ప మ గ మా పా ; ; ని ద మా ; | ; ప ద | ద స ని ద ప మ ప ద ॥ |
| కో . మ లి . నె . . లు . ర . . కో . రి . | క . | . . ది . ర్చ . . ర ॥ |

చిట్టస్వరం :—

| | | |
|---|---|---|
| నీ ; ; దా ; పా ; మా ; గా ; రీ ; సా | ; గా | ; మా . పా ద ॥ |
| దా ని ప ద మ ప ని దా ని ప ద గ మ ని దా ని ప ద రి గ ని దా ని ప | ద స ప స | దా ని ప ద మ ప ద ॥ |
| ని ద ని ప ద మ ప ద ని ద ప మ గ రి స రి గ మ గ రి గ మ ప ద ని ద ప మ | ప ద రి స | ని ద ప ని ద మ ప ద ॥ |
| సా . ప ద స రి స ని స ని ద ని ద ప ద ప మ ద ప మ ప గ మ పా స రి | స మ గ రి | గ మ ప ద ప మ ప ద ॥ |
| స రి గ రి గ మ మ గ రి గ రి స ని ద ప ద రి రి స ని ద ప రి స ని ద ప ని | ని ద - మ ని | దా మ రి గ మ ప ద |

# హిత బోధ

పువ్వాడ శేషగిరిరావు

శ్రీ రామచంద్రుఁడు రావణ సంహారణార్థము వానర సేనతో, సముద్ర సంతరణము చేయుచున్నాఁడని విని, విభీషణుఁడు రావణున కిచ్చిన హితోపదేశ మిది.

సిరి సీతాంబ, రఘూద్వహుండు హరి, సృష్టి వ్యాపనాంతక్రియా
భర నిర్వాహకుఁ డార్త రక్షణ కృపా పారీణుఁడై, ధూర్త సం
హరణోద్యోగము పూనినాఁడు రమణీ వ్యాజమ్ము నీ రావణా
సుర వంశక్షయ కార్య బీజ మిది, రక్షో నాయకగ్రామణీ!

హరి వచ్చెన్ గిరిడిగ్గి నిశ్చిత సమీకారంభ సంరంభియై
గిరి సంచార ధురంధర వ్రజముతోఁ గేల్మోడ్చి మేన్వంచి య
ప్పురి సంధి ప్రళయాంబు ధీశుఁడు శరప్రత్యుత్క్రమోద్యద్ధను!
పరివేషం గని యిచ్చి పోంటెఁ దరణో పాయమ్ము లంకేశ్వరా!

తెలుగన్ వచ్చు ఫణీంద్రు దంష్ట్రి, కలయంపిం జేసి చల్లింపఁగా
దరమౌ సర్గప సప్తకమ్ము. దిగి భోద్యద్దంత యుగ్మంబులం
జిలుకన్ వచ్చును, వెండి కొండ పలచేఁ జిక్కించుకో, వచ్చు దు
ర్భర రామ భ్రుకుటీ దృగంచల ధనుర్బాణాగ్రముల్ సైతువే?

చెలుచేతం దటిగిన్ విరాధుని శరచ్ఛేదారట ద్దేహుఁగా,
నలిమెం దాపఁ, జించి చీల్చె ఖరునిం, దున్మాడె మారీచు, న
న్నరుదే కాఁదె? పులస్త్య మన్మఁడవు, క్రన్నన్ బ్రహ్మ
వయ్యయ్యో! నే
డెఱుగుం జెప్పఁగ నెంత వాడ? ధిషణం ధీంద్రివసీ అగ్రజా!

మతి తప్పేరిది? దుష్ట శూర్పణఖ యమ్మెన్ జానకిన్ మింగఁటోఁ
బరిభావం బొనరింపఁ దప్పా? ఖరుఁ దప్పా పాత్మకై బోవఁ బం
పుటదో? కన్మొఱఁగించి యాలి గొని నీ 'పూ' దంచుబాటంగ నా
తరుణిం బుచ్చు మటంచు బంపె నొక దూతన్, రాముఁ దప్పేడనూ?

కరియూధంబుల దాన ధార లవి యింకం జొచ్చె డిల్లమ్ము లై
తురగమ్ముల్ దొరగింపఁ గన్నొలకులందు న్నీరు మున్నీరుగాఁ
దిరమై ధూమము గప్పె హోమముల వై దేహీ ప్రవేశమ్ముతో!
హరి వచ్చెన్ సిరిఁ గూర్చి, నీ సిరిఁ బరన్యస్తమ్ముఁ గావింతువే?

గరితం దెచ్చితి చిచ్చుఁ దెచ్చితివి లంకం గాల్పఁగా, బచ్చనౌ
సిరులా? మచ్చుమునుంగు వంగడమొ? విశ్లేషమ్మునౌ దానవే
శ్వర సింహాసన? మన్వయాంకుర కరస్వామ్యమ్ము గోల్పోవు నే
తరుణిం బుచ్చుము, శ్రీలు దక్కు, రఘుచంద్రస్వామి నిన్మెచ్చెకిన్

శరణం గోరుమటంచు నెమ్మి పెరిమన్ జంపార్చి, లోవెల్గు ముం
దెఱకం దూర్చి, విభీషణుండు పలుకన్, జృంభించి తద్రావణా
సుర నాగేంద్రుఁడు త్రొక్కఁబడి బుస్సుచు గొన్దై నేకధృతి
స్ఫురణన్ రత్న కిరీట మండిత శిరస్సుల్ తూగ నుగ్రాకృతిన్



ఎక్కువ గోధుమలు దిగుబడికి ఏమి చేయాలో విస్తరణశాఖోద్యోగులు చెబుతూంటే వింటున్నాడు నిహాలూ రాం.

# విజయానికి ఒకటే దారి

ఆర్. సి. వత్స

అవును విజయానికి చాల సులువయిన దారి ఒకటే। అది ఏమిటంటే కష్టపడి పనిచేయడం.

చౌదరీ నిహాలూరాం కథవింటే మీరూ ఒప్పుకుంటారు. విజయానికి మరొక దారి లేదని.

పంజాబ్‌లోని రోహతక్ జిల్లా గ్రామం భగవతిపూర్‌కు చెందిన రైతు చౌదరి నిహాలురాం. ఏమీ పండని బీడునేలనుండి రాష్ట్రస్థాయి పోటీలలో వరుసగా బహుమతులు గెలిచిన పంటలు పండించాడు. నిహాలురాం। అది ఎట్లా సాధ్యమయింది? ఇదుగో చదవండి.

పదిహేనేళ్ళ క్రింద నిహాలురాం యొక్క పదహారు హెక్టేర్ల పొలం బట్టి బీడుభూమిగా వుండేది. నాతు సరిగా పడిసేదికాదు. పైరులు చాల చాల తక్కువ దిగబడులనిచ్చేది.

ఇంతటి భూమిలో ఒక మూల ఇటుకల బట్టీ ఒకటి వుండేది - "అంతటి నిరాశాజనకమైన దృశ్యం మరొకటి వుండదు ఆ పొలంలో పగటిపూటే దయ్యాలు కన్పించేవి." అని వర్ణించాడు నిహాలూరాం.

ఈ భూమినుండి బంగారం పండించడానికి నిర్ణయించాడు. నిహాలూరాం. మొదట ఆ భూమినంతా చదునుచేసి బీడు భూమిని సాగులోకి తీసుకొద్దామని నిశ్చయించాడు. వాళ్ళ కుటుంబమంతా కలిసి, మరొకరి సాయం లేకుండా, రాత్రింబగళ్ళు పనిచేస్తే ఒక ఏడాదికి పూర్తయింది ఆ పని.

తర్వాతి సమస్య—అంత తక్కువ భూమినుండి మంచి పంటలు పండించడం ఎట్లా అన్నది. పచ్చియాకు మొక్కలను ఎరువుకోసం పెంచమని సలహా ఇచ్చాడు. ఆ వూరి గ్రామ సేవక్. అతడే నిహాలురాం. ఏయే రకాల పంటల నెపుడెపుడు పండించాల్సింది ఏయే రకాల నెన్నుకోవల్సింది। ఇంకా ఏమేమీ చేయవల్సిందీ అన్నీ చెప్పాడు "ఆయన సలహా సాయమూ లేకపోతే నేనేమీ సాధించి వుండలేను" అంటాడు నిహాలూరాం

గ్రామసేవక్ సలహాల మేరకు దీక్షతో కృషిచేయగా క్రమంగా మంచి ఫలితాలు రాసాగాయి. జిల్లా స్థాయి పోటీలలో ఎక్కువ ప్రత్తి దిగుబడికి 1953 లోనూ, ఎక్కువ గోధుమ దిగుబడికి 1954 లోనూ బహుమతులు లభించాయి। రోహతక్ బ్లాక్ కంతటికీ — చక్కగావున్న పొలానికిచ్చే బహుమతి కూడా నిహాలూరాంకే వచ్చింది. అతడి ఎడ్లజతకూ ఒక ఉత్తమ బహుమతి వచ్చింది.

పాత, క్రొత్త పద్ధతుల మధ్యగల భేదాలు తెలుసుకున్న నిహాలూరాం తనకు కావలసినది సలహాలకు సాయానికి బ్లాక్, జిల్లా వ్యవసాయ శాఖ ఉద్యోగుల దగ్గరికి వెళ్ళేవాడు. వీరు అతి శ్రద్ధగా అతడి పొలానికి వచ్చి చూసి సలహాలిచ్చేవారు. కొన్నివేల రకపు పనిముట్లను అతడికి ఉచితంగా ఇచ్చారు.

నిహాలురాం చెఱకు పండించడానికి పూనుకున్నాడు. వ్యవసాయశాఖవారు చెప్పిన వంగడాన్ని ఎన్నుకున్నాడు. చెఱకు అభివృద్ధి అధికారి సలహాలను తుచ తప్పకుండా పాటిం

చాడు. బ్రహ్మాండమైన విజయం సాధించాడు. 1960, 62, 63 సంవత్సరాలలో పంజాబు రాష్ట్రమంతటికీ ఎక్కువ చెఱకు దిగుబడి సాధించి బహుమతులు గెలుచుకున్నాడు నిహాలురాం. 1961లో అతడి చెఱకు దిగుబడి దేశమంతటిలో మూడవ స్థానం ఆక్రమించింది. ఇందుకు అతడికి ఒక పతకమూ, వెయ్యి రూపాయలూ లభించాయి.

ఇపుడు నిహాలురాం చెఱకు, గోధుమ పండించడంలో ప్రవీణుడయాడు.

చెఱకు పంటకు ముందు, పచ్చియూరు ఎరువు వేసి పన్నెండు దఫాలు దున్నుతాడు. హెక్టేరుకు 600 క్వింటాళ్ల చొప్పున పశువుల పెంట తోలిస్తాడు.

చెఱకు మోసులను "అగలాల్-3" అన్న (మెర్క్యూరియల్ కాంపౌండ్) మందులో ముంచితీస్తాడు. ఇందువలన మోసులు త్వరగా అంకురిస్తాయనీ వాటికి చెదపురుగుల బెడదవుండదనీ అంటాడు నిహాలూరాం.

వాట్లతోబాటుగా కేల్షియం అమ్మోనియం నైట్రేట్, సూపర్ ఫాస్ఫేట్ల మిశ్రమాన్ని హెక్టేరుకు $\frac{1}{2}$ క్వింటాలుల చొప్పున వేస్తాడు. దీనివలన చిన్న మొక్కలకు ఆహారం సిద్ధంగా వుంటుంది అంటాడతడు.

వరుసల మధ్య 60 సెంటీమీటర్ల దూరం వుండేటట్లు కన్నుకుకన్ను ఎదురుగా మోసుల్ని నాటాడు. ఏప్రిలులో మొదటిసారి మట్టి తిరగదోసి నీరుపెట్టాడు. మేలో రెండవసారి జూన్‌లో మూడవసారి హెక్టేరుకు $2\frac{1}{2}$ క్వింటాలుల కేల్షియం అమోనియం నైట్రేటు వేసి పైపాటుచేశాడు



వ్యవసాయ శాఖాధికారులు చేసిన కో-312, కో.జే-46, కో-419 చెఱకు రకాలను పైరుచేసి అత్యధికమైన దిగుబడులు సాధించాడు చౌదరీ నిహాలూ రాం.

జూన్ తర్వాత చెఱకు పైరుకు ఎరువులు వేయరాదని, వేస్తే అనవసరపు పిలకలు బయట బేరుతాయి అని అతడి అభిప్రాయం.

పైరు చీడపురుగుల పాల పడకుండా శ్రద్ధతీసుకున్నాడతడు. పైరిల్లా, గుర్దాస్‌పూర్ బోరర్ మట్టి పురుగుల నివారణకై ఆగస్టులో ఎండ్రినం చల్లాడు. చెఱకు కోసినతర్వాత మోళ్ళపై ఎండ్రిన్ చల్లాడు. ఎఱ్ఱ తెగులు కనపడగానే అది ఆశించిన మొక్కలన్నిటినీ పీకి తగలపెట్టాడు

ఇంత కృషికీ ఫలితంగా అతడి చెఱకు పైరునుండి సగటున హెక్టారుకు 1200 క్వింటాలుల దిగుబడి లభించింది. పోటీలో పాల్గొన్న మడిలో హెక్టేరుకు 1658 క్వింటాలుల చెఱకు పండింది. ఇది ఆ జిల్లా కంతటికీ ఎక్కువ దిగుబడి. గోధుమ దిగుబడి హెక్టేరుకు 37 క్వింటాళ్ళు-అంటే ఆ జిల్లా సగటుకు నాలుగింతలు.

"ఈ హెచ్చు దిగుబడుల కీలకమంతా నేను పొలంపట్ల వహించే శ్రద్ధయే కారణం. పచ్చియూరు ఎరువు వేస్తాను. మా పశువుల పెంట యావత్తూ కంపోస్టు గొయ్యికి పోతుంది కాని వృధాకాదు. పొలంలోను, గట్ల మీదను ఒక్క కలుపుమొక్కయినా లేకుండా శ్రద్ధవహిస్తాను నేను. బాగా పాలుకావాలంటే ఆవు కెట్లా, ఎక్కువగా, పుష్టిగా ఆహారం పెట్టాలో, మంచిదిగుబడులకోసం పొలానికీ అంతే చేయాలి. ఏ చిన్న విషయంలోనూ అశ్రద్ధ పనికిరాదు. నవీన సాగు పద్ధతులను తుచతప్పకుండా పాటించాలి"- అన్నాడు నిహాలురాం.

అటువైపున్న గోధుమ పైరు చూపిస్తూ "ఇపుడు నా దృష్టి అంతా అదిగో ఆ పైరు పైనవుంది. రాష్ట్రంలో అత్యధికమైన గోధుమ దిగుబడి సాధించిన వారికి ట్రాక్టరు బహుమతిగా ఇస్తానని పంజాబు ప్రభుత్వం ప్రకటించింది. ఆ గోధుమ మడి నాకు ఆ ట్రాక్టరును సంపాదించిపెట్టాలని కృషి చేస్తున్నాను" అన్నాడు.

అతడి దీక్షను అతడి పైరును చూచిన నాకు నిహాలూరాం ఆశయం తప్పక నెరవేరగలదనే అనిపించింది.

[ఎఫ్. బి. యు.]





పుల్లెల పేరి సోమయాజులు వయొలిన్ (విజయవాడ, జనవరి 23)

[4వ పేజీ తరువాయి]

## పుస్తక పరిచయం

నన్నయాది మహాకవుల చరిత్రలభివర్ణించారు. రెండవ సంపుటికి కాకతీయ యుగమని పేరు పెట్టారు. ఇది క్రీస్తు శకం 1290 దాకా కొనసాగింది. మూడవ సంపుటిలో పద్మనాయక యుగ చరిత్ర వ్యాఖ్యానించారు. ఇది ఇంచుమించుగా సర్వజ్ఞసింగమ నాయకుని రాజ్యారంభంవరకు కొనసాగింది. ఇక నాలుగవ సంపుటంలో రెడ్డిరాజుల యుగం వచ్చింది.

మనం ప్రస్తుతం పరిశీలించుకుంటున్నవి, సమగ్రాంధ్ర సాహిత్యం అయిదు, ఆరు, ఏడు సంపుటాలు. రచయిత వీటిని క్రమంగా గజపతుల యుగమనీ, తొలి రాయల యుగమనీ, మలి రాయల యుగమనీ పేర్కొన్నారు. పూర్వపు సంపుటాలలోలాగే ఈ సంపుటాలలోకూడా మొట్టమొదట, ఆ యా కాలాల చరిత్ర సాంఘిక పరిస్థితులు ఆంధ్రదేశానికి సంబంధించినంతవరకు సంగ్రహంగా చర్చించారు.

ఈయన అనుసరిస్తున్న రచనా పద్ధతిలో ఒక ప్రత్యేకత ఉన్నది. ఆ యా వివాదగ్రస్త విషయాలనుగురించి ఒయలుదేరిన, బయలుదేరుతున్న వాదోపవాదాలు, గడ్డు సమస్యలు నిష్పాక్షికంగా వివరిస్తారు. వాటిలో తమకు అభిమతమయిన సిద్ధాంతాలు సహేతుకంగా స్వీకరిస్తారు. ఒక్కొక్కప్పుడు తాము ప్రత్యేకించి కనుగొన్న కొత్త విషయాలు, వినూత్న సిద్ధాంతాలు వెల్లడిస్తారు. తరువాత ఆ యా కవుల వ్యక్తి స్వభావాలతోబాటు, సారస్వత సేవ విశిష్టత చర్చిస్తారు. వారి వారి కావ్యాలలోనించి ఎన్నదగిన కమ్మని పద్యాలు కొన్ని ఉదాహరిస్తారు. ఇంకా ఇతర విశేషేవయినా ఉంటే బయట పెడతారు. మొత్తంమీద ఇది వీరి రచనా పద్ధతి.

అయిదవ సంపుటానికి శ్రీ ఆరుద్ర గజపతుల యుగమని పేరు పెట్టారని అనుకున్నాము. వాస్తవానికి ఓఢ్ర గజపతులకు వారి పరిపాలన కాలంలో ఆంధ్రదేశంలో వేర్వేరు విధాల విస్తరించిన మన సారస్వతానికి సంబంధమేమీ లేదు. ఆ యా గజపతులు. సంస్కృత సారస్వతానికి ఒరియా వాఙ్మయానికి కొంత సేవచేసి ఉండవచ్చును. తెలుగు దేశంలో లోపలికి చొచ్చుకువచ్చిన వీరి సామంతులయిన ఆంధ్ర ప్రభువులు కొందరు, మన సాహిత్యానికి చక్కని చేయూత ఇచ్చి ఉండవచ్చును. అంతేగాని గజపతులు ప్రత్యక్షంగా మన వాఙ్మయానికి ఏవిధంగాను సాయపడలేదు వీరి సంప్రదాయాల ప్రభావం మన వాఙ్మయంమీద కొంతవరకు పడినదని గ్రంథకర్త పేర్కొన్నారు. కాని అది ఒక సునిశిత సిద్ధాంతం కాదు. ఇంకా లోతుగా పరిశోధిస్తేనేగాని దాని వ్యవహారం తేలదు. పైగా గజపతుల దండయాత్రలవల్ల ఆంధ్రదేశం ఛిన్నాభిన్నమై సారస్వతానికి ఒకవిధంగా అడ్డంకి ఏర్పడింది. ఇందుచేత ఈ యుగానికి గజపతుల యుగమని పేరుపెట్టడం కన్న ఇంకేదయినా పేరు పెడితే బాగుండేది.

ఇక ఈ మూడు సంపుటాలలోను పోతన మొదలయినవారి కవిత్వంతో నిగ్గుతేల్చి విమర్శించవలసినప్పుడుకూడా, శ్రీ ఆరుద్ర ఇంతకు పూర్వం వెల్లడిఅయిన విమర్శన ధోరణులే సంగ్రహంగా తమ గ్రంథంలో పొందు పరిచారు. అంతేకాని, కొత్తగా సునిశితమయిన సాహిత్య విమర్శనకుపక్రమించలేదు. అయితే ప్రతి కవిమీద పడిన ప్రాచీనుల ప్రభావాలు, ఛాయలు మొదలయినవి పరిశీలించి వివరించారు. వీరి సంపుటాలు ఆ యా శాసనాల వాదోపవాదాల కవిలె కట్టలు కావు. వీటిలో చారిత్రిక సమస్యల వాదోపవాదాలకన్న సరస సాహిత్యాస్వాదనకే ఎక్కువ ప్రాముఖ్యం ఇచ్చారు. దీనివల్ల ఈ సంపుటాలకన్నింటికి కొత్త కళ వచ్చింది. వీరి సంపుటాలలో ఇంకొక ముఖ్య గుణం ప్రత్యేకంగా పేర్కొనాలి. వీరి శిష్ట వ్యావహారిక శైలి స్వానువుగా, అనర్గళంగా సాగిపోతుంది. చదివినకొద్ది ఇంకా చదవాలన్న ఆసక్తి కలిగిస్తుంది. ఈ మూడు సంపుటాలు చక్కని చిన్న నవల లాగ ఎంతో అహ్లాదకరంగా ముమ్మందుకు సాగిపోతాయి. అంతేకాని బరువయిన చరిత్ర గ్రంథాలలాగ భయపెట్టి బాధపెట్టవు. ఇంతకు మునుపు వెలువడిన సాహిత్య చరిత్రలలో ఈ గుణం కొరవడింది ఇందుచేత పండితులేకాని మిగిలినవారంతగా వాటి జోలికి వెళ్లరు.

శ్రీ ఆరుద్ర ఈ సంపుటాల రచనకోసం చాలా పరిశ్రమచేశారు. ప్రతి కవినిగురించి ప్రతి సాహిత్య సమస్యనుగురించి ఇంతకుమునుపు వెలువడిన సారస్వతం అంతా చక్కగా ఆకళించుకున్నారు. అపైన నిశితంగా పరిశీలించిన తరవాతే తమ సంపుటాల రచనకుపక్రమించారు. ఇది ప్రత్యేకించి అభినందించదగిన విషయం.

అయితే ఇంత సువిస్తృతమయిన సమగ్ర సాహిత్య చరిత్ర రచిస్తున్నప్పుడు విచారగ్రస్తాలయిన విషయాలనేకం చర్చిస్తున్నప్పుడు, ఒక్కొక్కప్పుడు రచయితతో మనం ఏకీభవించలేక పోవచ్చును. ఆ యా విమర్శనతోకూడా మనకు ఏకీభావం కలగకపోవచ్చును. ఒక్కొక్క విషయం మరికొంత విస్తరిస్తే బాగుండునని అనిపించవచ్చును. కాని ఇంతమాత్రం చేత రచయిత పరిశ్రమ యెడలగాని, నిజాయితీ యెడలగాని మనకేవిధమయిన అపనమ్మకము కలగదు. శ్రీ ఆరుద్ర సుమారు రెండు వందల యాభై పుటల పరిధిలో ఆ యా యుగాల ఆంధ్ర సారస్వత చరిత్ర సామాన్య పాఠకునికియ్యాలని సంకల్పించుకున్నారు. వారిలో సాహిత్య చరిత్రపై విజ్ఞానంతోబాటు, ఆసక్తి పెంపొందించాలని అభిలషించారు. సమగ్రాంధ్ర సాహిత్యం వారి హృదయాలకు హత్తించి కృతకృత్యులయినారు.

ఈ మూడు సంపుటాలకు మొట్టమొదట శ్రీ పి. వి. రాజమన్నారు గారు పరిచయ వాక్యాలు వ్రాశారు. ఆపైన అయిదు, ఆరు, ఏడు సంపుటాలకు క్రమంగా డాక్టరు గిడుగు వెంకటసీతాపతి. శ్రీ ఖండవల్లి లక్ష్మీరంజనం, శ్రీ దివాకర్ల వెంకటావధాని పీఠికలు వ్రాశారు. ఇవన్నీ సంపుటాలకు మకుటాలు.

శ్రీ ఆరుద్ర మూడు సంపుటాల చివర తాము పరిశీలించిన ప్రమాణ గ్రంథాల పట్టిక లిచ్చారు. ఇవి గ్రంథకర్త ప్రగాఢ పరిశ్రమకు చక్కని తార్కాణాలు. వీటివల్ల పాఠకులకు ఆయా సారస్వత సమస్యల యెడల చక్కని ఆసక్తి అభిరుచి, అభినివేశము కలుగుతాయి. వీరు ఈ సంపుటాలలో ఆయా కావ్యాలనించి ఏర్చి కూర్చి ఉదహరించిన పద్యాలెంతో హృద్యంగా ఉన్నాయి. చింతలపూడి ఎల్లన్న రాధా మాధవంలోని ఈపద్యం దీనికొక మచ్చు తునక :—

బాల క్రీడల గన్నతల్లికి మనఃప్రహ్లాదముంజేయుదున్
హేలామైత్రి ఘటించి గోపకులతో నేపాద వర్తింపుదున్
కేలింజారుడవౌచు గోపికల కౌగిళ్ళన్ వినోదించు, ధీశా
లిత్వంబులు నీకెయొప్పు, నీవు కృష్ణా గోపికా వల్లభా.

ఈ సంపుటాలు మూడు చదువుతూంటే మన చరిత్ర, కళలు మొదలయినవాటిని గురించికూడా విజ్ఞులెవరయినా సామాన్య పాఠకుల కందుబాటులో ఉండే, ఇలాంటి గ్రంథాలు రచిస్తే బాగుండునని అనిపిస్తుంది.

ప్రకాశకులు ఈ సంపుటాలు మూడు చక్కగా, నిర్దుష్టంగా ప్రకటించారు. ఈ విధంగా సామాన్య ప్రజానీకానికీ సారస్వత చరిత్రపై అభిరుచి కలిగిస్తున్న వారికివే నా అభినందనలు. ఇదేవిధంగా ఇక మిగిలిన నాలుగు సంపుటాలు కూడా ప్రతి నెల సక్రమంగా వెలువరించగలరని ఆశిస్తున్నాను.

ఈ మూడు సంపుటాలు శ్రోతలందరు తప్పక పరిశీలించదగినవి. ఒక్కొక్క సంపుటి వెల అయిదు రూపాయలు. ప్రతులకు—శేషాచలం అండ్ కంపెనీ, మదరాసు అని వ్రాస్తే లభిస్తాయి.

## జీవన ప్రమాణాలు

(2.వ పేజీ తరువాయి)

కోడు ఆహారపదార్థాలేకాక, ఇనుము ఉక్కు, సిమెంటు కలప మొదలైన వాటి వినియోగం పొదుపుగా జరిగేటట్లు జాగ్రత్తపడుతున్నది. ఉత్పత్తి హెచ్చింపునూ దిగుమతి కావలసిన వాటికి మారుగా, దేశంలో లభించే వాటినే వాడటాన్ని ప్రోత్సహించే నిమిత్తం కొన్ని ఆర్థిక ఉపశమనాలను కూడా ప్రవేశపెట్టింది ప్రభుత్వం తన ద్రవ్య పరపతి, ధరల విధానాలను కొంత మార్చుకొంటే ఈ చర్యలవల్ల కోరిన ఫలితం చేకూడుతుంది.

### ఉత్పత్తి పెంచాలి

ప్రభుత్వం ఈ సమస్యతో సతమతమవుతూ వుంటే, పులిమీద పుట్ర వలె పాకిస్తాన్ దురాక్రమణ, చైనా బెదిరింపు దాపురించాయి. దేశం అత్యంత అత్యయిక పరిస్థితిని ఎదుర్కొంటున్నది. రక్షణ అవసరాలు, పౌర అవసరాలు అన్నింటికీ సరిపోను పారిశ్రామిక వ్యావసాయిక ఉత్పత్తులను పెంచుకోవలసి వచ్చింది. ఈ సందర్భంలో దేశం అంతటి క్షేమంకోసం, వ్యక్తి త్యాగం చేయవలసి వుంటుంది. ప్రతి ఒక్కరూ తాము వాడే అన్ని వస్తువులనూ పొదుపుగా వాడుకొంటూ, దుబారా కాకుండా జాగ్రత్తపడితే లభించేదీ, కావలసినదే సమంగా వుండేటట్లు చేసుకోగలగటమేకాక, ధరల స్థాయిని కూడా అదుపులో వుంచవచ్చు.

### ధరలు తగ్గేటట్లు చేయడం

వర్తకులు అవసరంగా ధరలు పెంచేస్తారనేమాట తరచు వినిపిస్తూ వుంటుంది. వర్తకుడు ఈనాడు అసంఖ్యాకమైన కంట్రోళ్లు, నిబంధనలు, పన్నుల భారం మొదలైనవాటితోనే సతమతమవుతున్నాడు. ధరలు పెంచితే పరువుపోవటమే కాక అసలు వర్తకానికే మోసం రావచ్చు. కనుక ధరలు పెంచే ఆలోచనే అతనికి వీలు కదా మన సుమతీశతక కర్త, లేదు. కనక, వాడకందారులు తమ కొనుగోళ్ల విషయంలో ఖచ్చితంగా వుండి, న్యాయమైన ధరకు మించి పెట్టరాదనీ అనవసరమైనదానిని కొనరాదనీ నిశ్చయిందుకొంటే ధరల పెరుగుదలను అరికట్టటమే కాదు, ధరలు తగ్గేటట్లుకూడా చేయవచ్చు ధర హెచ్చుట తగ్గుకొరకె అన్నాడు

ప్రస్తుత అత్యవసర పరిస్థితివల్ల, దుబారా, అడంబరం, ఆర్థిక వినియోగం—ఈ మూడింటినీ అరికట్టటానికిఅబాలగోపాలంకృతనిశ్చయులం కావాలి. దురాక్రమణదారు పైనే కాక ధరల పెరుగుదలపైకూడా ప్రభుత్వం సాగించే సమర విజయానికి అది తోడ్పడుతుంది.

అట్టి సహకారం వుంటే తక్కువ ధరలు, సరకుల సమృద్ధి కొంచెం దబ్బుతే ఎక్కువ సౌకర్యాలు, ఎక్కువగా వెనుకవేసుకొనే అవకాశాలు వుండేటట్లు దేశం సంపత్సౌభాగ్యాలతో తులతూగే దినం ఎంతో దూరం వుండదు.


వార్త
విడి ప్రతిక వెల పైసలు
సంవత్సర చందా రూ. 8-40 పైసలు




## అఖిల భారత కదంబ కార్యక్రమము

జనవరి 16-వ తేదీ ఆది వారం నుండి జనవరి 31-వ తేదీ సోమవారం వరకు

I వ ప్రసారము
ఉ॥ 7.00 నుండి 9.30

II వ ప్రసారము
10-15 నుండి 12.30

III వ ప్రసారము
మ॥ 2.00 నుండి 5-30

IV వ ప్రసారము
సా॥ 6-30 నుండి 10-40

(శనివారములు IV వ ప్రసారము 6-30 నుండి రా॥ 11-10 వరకు)

### ఉ॥ ప్రసారము I

49.71 మీ (6035 కిలోసై)
49.30 మీ (6085 కిలోసై)

7-00 వందనవార్ — భక్తి గీతాలు
7-30 అర్చన
7-40 ఝలక్ — కార్యక్రమ విశేషాలు
7.45 ఉదయగాన్ — దేశభక్తిగీతాలు, బృందగానం
8.00 మంజూషా — జానపద, ప్రాంతీయ సంగీతం
8-15 హిందీలో వార్తలు
8.30 జయమాల
9.30 ప్రసార సమాప్తి

### ప్రసారము II

41.44 మీ (7240 కిలోసై)
41.32 మీ (7260 కిలోసై)

0.15 తనవంతి
0.30 తరంగ్ తండ్
10-50 సమాచార్ — హిందీలో వార్తలు
10-55 సంగీత సేతు

#### ఆదివారాలు ముఖ్యమైన పండుగ దినాలు

11.00 చిత్రధ్వని — సంక్షిప్తశబ్దచిత్రం (హిందీ)
(ప్రతి నెలా 1. 3. 5 ఆదివారములలో)
కలాకార్ — సంగీతం, హాస్యకథనలు, పాటకథలు
(ప్రతి నెలా 2. 4. ఆదివారాలు, పండుగదినాలు)

11 00 జయమాల
(అన్ని రోజులు)
12.30 ప్రసార సమాప్తి

### మ॥ ప్రసారము III

31.25 మీ (9600 కిలోసై)
41.32 మీ (7260 కిలోసై)

[ఆదివారాలు పండుగ దినాలు]
2.00 అప్నాఘర్ — మీ ఇంట్లో అందరికి
[వారములో ఇతర రోజులలో]
2.00 ఫుల్వారీ — సంగీత కదంబం
[వారములో అన్నిరోజులు]
2.30 జయమాల
3 30 చౌవరా — మాటలు, పాటలు

#### కర్ణాటక సంగీత కార్యక్రమము

3-45 అంజలి-గీతావళి
4.00 గీతమాలిక
4.30 మధురగీతం — మీరు కోరిన పాటలు (ఆది, బుధ, శుక్రవారములు)
5-30 ప్రసార సమాప్తి

### సా॥ ప్రసారము IV

41.44 మీ (7240 కిలోసై)
31.33 మీ (9575 కిలోసై)
49.30 మీ (6085 కిలోసై)

6-30 రాగ్ రంగ్
6-45 జయమాల — యుద్ధ సైనికులకు
7.45 వాద్యమాధురి — వాద్య కదంబం
8.00 గజరా
8.15 హిందీలో వార్తలు
8.30 మెహ్-ఫిల్ — కదంబం
9.00 చతురంగ్ — పాటలు
9.15 హవామహల్ — నాటికలు, రూపకములు హాస్యకథనలు
9.30 జయమాల
10.30 నూపుర్
10.35 సమాచార్ — హిందీలో వార్తలు
10.40 ప్రసార సమాప్తి

#### శనివారములు

10.30 గీత మంజరి — లలిత సంగీతం
11.00 నూపుర్
11.05 సమాచార్
11.10 ప్రసార సమాప్తి

### బెంగుళూర్ - బి

365.9 మీ (820 కిలోసై)
వివిధభారతి ([illegible])

| ఆదివారములలో | ఇతర రోజులలో |
| --- | --- |
| ఉ॥ 7.00 నుండి 8.30 | ఉ॥ 7.00 నుండి 9.30 |
| 10.50 నుండి 12.50 | 10.50 నుండి 11.50 |
| మ॥ 2.00 నుండి 3.00 | మ॥ 2.00 నుండి 3.00 |
| 4.00 నుండి 5.00 | 4.00 నుండి 5.00 |
| సా॥ 6.30 నుండి 10.30 వరకు | సా॥ 6.30 నుండి 10.30 వరకు |

[వివరాలు 48-వ పేజీలో]

ఇతర వివరములకు, ప్రొడ్యూసర్, 'వివిధభారతి' ఆకాశవాణి, పోస్ట్‌బాక్స్ 4, బొంబాయి-1.

Printed at [illegible] Press, Madras-1—Edited and Published by the Station Director All India Radio, Madras-4.



వాసా కృష్ణమూర్తి: వీణ (విజయవాడ, జనవరి 21)



డా॥ బి. వేదమణి: "పరిమిత కుటుంబము-కొన్ని సలహాలు"
(విజయవాడ, జనవరి 12)



ఎమ్. ఎ. కల్యాణకృష్ణ భాగవతర్: వీణ (మద్రాస్, జనవరి 31)





ఎస్. సి. సత్యనారాయణ: గాత్రం
(హైదరాబాద్, జనవరి 16)



హైదరాబాద్‌లో దేశరక్షణకై స్వర్ణదానం చేసిన రేడియో
మహిళామండలి సభ్యురాండ్రు



హైదరాబాద్ కేంద్రమునుండి ప్రసారమైన 'అభిజ్ఞుల అభిప్రాయం'
కార్యక్రమములో పాల్గొన్న ప్రముఖులు

Regd. No. M. 5404



జమ్మూలో మొదటి పాకిస్తాన్ జెట్ విమానాన్ని పడగొట్టి వీరచక్ర పథకాన్ని పొందిన హవలార్ పోతరాజు (వీరితో పరిచయము ఇటీవల హైదరాబాద్ కేంద్రమునుండి పిల్లల కార్యక్రమంలో ప్రసారం చేయబడినది)



ఆకాశవాణి స్టూడియోలో బాల బాలికలతో హవల్దార్ పోతరాజు



రేడియో సంగీత సమ్మేళన సందర్భంలో హైదరాబాద్ కేంద్రంలో జరిగిన ఎమ్. ఎస్. సుబ్బులక్ష్మిగారి గాత్ర కచేరి



ఈ కచేరికి హాజరైన ఆంధ్రప్రదేశ్ గవర్నర్ శ్రీ పట్టం థానుపిళ్లై, వారి సతీమణి తదితర ప్రముఖులు



ఇటీవల ఆకాశవాణి విజయవాడలో జరిగిన కార్యక్రమ సలహా సంఘ సమావేశము